## షష్ఠిపూర్తి మహోత్సవ శుభసందర్భంగా మా చిరుకానుక

ది. 10-9-2001



**శ్రీ నల్లమిల్లి సత్యనారాయణరెడ్డి**

వారి సతీమణి **శ్రీమతి లక్ష్మీకాంతము**

Acc. No. 23417

# షష్ఠి-పూర్తి శుభాశీస్సులు

శ్రీమతి & శ్రీ నల్లమిల్లి సత్యనారాయణరెడ్డి దంపతులకు -

విశాలహృదయులు-వివేకమూర్తులు-వితరణశీలురు విజ్ఞాన మూర్తులు-ఆధ్యాత్మిక జీవనప్రియులు-దైవకార్యధురంధరులు - ఆలయాల నిర్మాణప్రియులు - వ్యాపారవేత్తలు - అనేక సంస్థలకధిపతులు.

## వారి ప్రజ్ఞాన గుణములు

1. కాని పని పూనరు - పూనిన పని మానరు.
2. నిత్య సంతోషప్రియులు - నిరంతర దానశీలి.
3. సత్య మార్గానువర్తులు - సత్సంగ ప్రియులు.
4. ధర్మవాక్య ప్రవక్తలు - ఆచరణయోగులు
5. సత్కార్య సాధకులు - సధర్మచారులు

శతాయుష్మంతులై - ఆర్తులకు అనాధలకు, బీదలకు - విద్యార్థులకు మీ సేవలు అందించుదురుగాక!

37HS
ACF



ఇట్లు
మీ ఆత్మీయులు శ్రేయోభిలాషులు
**యోగాచార్య డా॥ వి.వి. రామరాజు**
ప్రకృతి చికిత్సాలయం
కాకినాడ - 533 005 ☎ 375038

# సమతర్పణ

ఆత్మీయులు - గురుతుల్యులు

యోగాచార్యులు - వయోవృద్ధులు అనేక

గ్రంథ రచయితలు అయిన

శ్రీ వి.వి. రామరాజుగారు రచించిన

## గీతారహస్యము

అనే ఈ చిన్న గ్రంథము నన్నెంతో ఆకర్షించినది. ఒక్క అరగంట కాలములో కృష్ణభగవానుడు అందించిన 18 యోగమార్గములను సరళ భాషలో అందించినారు. ఈ చిన్న పుస్తకము అందరి మనస్సులను పరిశుద్ధి చేస్తుందన్న సంకల్పంతో నా **"షష్టిపూర్తి-మహోత్సవము"** సందర్భముగా తమకు చిరుకానుకగా ఈ గ్రంథము అందించుచున్నాను.



ఇట్లు ఆత్మీయులు

**శ్రీమతి & శ్రీ నల్లమిల్లి సత్యనారాయణరెడ్డి**

ప్రెసిడెంట్ : కాకినాడ ఏరియా రైస్ మిల్లర్స్ అసోసియేషన్

**శ్రీ సత్యలక్ష్మి నిలయం, పేర్రాజుపేట, కాకినాడ - 3.**

ఫోన్స్ : (O) 344659, 343503, (R) 364236, 343889

# గీతా రహస్యమ్



రచన : డా॥ వి.వి. రామరాజు

వితరణ :

శ్రీమతి & శ్రీ నల్లమిల్లి సత్యనారాయణరెడ్డి

పెద్దల సాంగత్యమెక్కువ ఒంట్లో ఓపికలు తక్కువ. బాధ్యతలు బరువులు ఎక్కువేగాని, తగిలించుకొని తంటాలుబడుట తక్కువ. కోరికలెక్కువే. గాని కోపతాపాలు తక్కువ. చేసే పని ఎక్కువ తినే తిండి తక్కువ. అభిరుచులెక్కువ, తినేరుచులు తక్కువ. యోగత్యాగాలు ఎక్కువ, భోగరోగాలు తక్కువ. ఆలోచనలు ఎక్కువ, అందుబాట్లు తక్కువ. ఇలా నడిచిపోతుంది ఈ బండి.

**శ్లో॥ శైశవేభస్త విద్యానాం - యవ్వనే - విషయైషణాం ।**
**వార్ధకే - ముని వృత్తీనాం యోగేనాంతే, తనుత్యజాం ॥**

(అన్నది శాస్త్రం)

తా॥ శైశవంలో అనగా బాల్యంలో 25 లేక 30 సం॥ల వరకూ శ్రద్ధగా చదివి సంపూర్ణ విద్యావంతులు, విజ్ఞానవంతులు కావాలి. యవ్వనంలో 30 నుండి 60 సం॥ల వరకు, ఇంద్రియ ప్రేరేపణల ననుసరించి ప్రజ్ఞావంతుడవై ఐహికసుఖాలననుభవించాలి. అప్పటికి వార్ధక్యం రానేవస్తుంది. అట్టి స్థితిలో 60 నుండి 80 నుండి 90 సం॥ల వరకు సంసార బంధనాలనుండి విడివడి మునివృత్తి ననుసరించి బ్రహ్మచర్యమును పాలించుచు యోగసాధన, ఆధ్యాత్మిక చింతనంతో వానప్రస్థ జీవితం గడపాలి. 85 నుండి 100 సం॥ల మధ్యలో నీ దేహశక్తులుడిగిపోయి దేహ స్వాధీనత తగ్గినప్పుడు యోగివై దేహత్యాగం చెయ్యాలి. గాని రోగివై మరణించరాదు అన్నది పై శ్లోకార్థం.

నేనొక ప్రకృతి వైద్యుడనైన కారణంగా నా 65 సంవత్సరముల వైద్యానుభవములను యోగానుభవములను వ్రాయాలన్న హృదయావేదనవల్ల, అందరికి అందిచాలన్న నివేదనలు నాలో మిగిలిపోయాయి. నాకిప్పుడు తీరిక ఎక్కువ, నిద్ర తక్కువ. అందువల్ల కాలం కలిసి వచ్చినప్పుడంతా నామస్తకంలో కదిలినవన్నీ పుస్తకాలుగా రూపులు దిద్దుకున్నాయి. శరీరధర్మాలను, ఆరోగ్యసూత్రాలను, ఆహార నియమాలను, వివిధరోగాలను, వాటి నివారణోపాయాలను, అంతేగాదు యోగసాధనలను, యోగవ్యాయామాలను, ప్రాణాయామాలను, నిర్విచార భావిజీవితాలను, ప్రాణప్రతిష్ఠలను గూర్చి వ్రాసి నవవిధపుష్పములను అందరికి అందించుకొనుట జరిగినది.

ఆ పుస్తకములన్నియు ప్రజాధరణను సంతరించుకొని వేలాది పుస్తకములు ప్రజల చేతులలో పరవళ్ళు త్రొక్కుచున్నవి.

ఈ రోజులలో మానవ లోకానికి విషయలంపటలు పెరిగి మనుగడకే సమయించాలక, పరుగులు పెరుగుచున్నాయి. మానవ జీవిత పరమావధికి మార్గమందించేది. భగవంతుడందించిన భగవద్గీత ఒక్కటే. అందులో 18 అధ్యాయములు 18 యోగమార్గముల నందించుచున్నవి.

**శ్లో॥ తపస్విభ్యో-ధికోయోగీ - జ్ఞానిభ్యో-పి మతో-ధికః ।**
**కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగి భవార్జున ॥** (6-46)

అర్జునా! యోగమును గూర్చి చెప్పుచున్నాను వినుము.

# గీతా రహస్యమ్

## కురుక్షేత్రమనగా = మన హృదయక్షేత్రము

అర్జునుని - రధము = మన శరీరము.

సారధియైన కృష్ణుడు = ప్రజ్ఞారూపమగు బుద్ధిని వికసింపజేయు పరమాత్మ శక్తి-రధికుడు అర్జునుడు = చంచల మనస్కుడైన జీవుడు.

గుఱ్ఱములు = ఇంద్రియములు.

కౌరవులు (ప్రతిపక్షసేన)=కామక్రోధ-రాగ-ద్వేష-అహంకార-మమకారది దుర్గుణములు.

పాండవ-స్వపక్షసేన=ధర్మం-న్యాయం-ధైర్యము-భక్తి-శ్రద్ధ-నిశ్చలత, ఏక్రాగతలు.

అర్జునుని ధనస్సు=సాధన సంపత్తి-చతుష్ఠయములు.

సంజయుడు = వివేకము.

ధృతరాష్ట్రుడు = అంధత్త్వము, అవివేకము, అజ్ఞానము, అవిద్య దుర్యోధనుడు = అహంకారము - మమకారము - కామములు. భగవద్గీతవజీవునిగూర్చి-మనస్సునుగూర్చి-హితాహిత కార్యములను గూర్చి-జ్ఞానమార్గమునుగూర్చి బంధవిముక్తినిగూర్చి - బోధించేది.

## గీతయందలి 18 అధ్యాయములలో
## మొదటి ఆరు యోగములు కర్మషట్కములు (శ్రవణములు)

7 నుండి 12 అధ్యాయయోగములువభక్తిషట్కములు (మననములు) 13 నుండి 18 అధ్యాయయోగములువజ్ఞానషట్కములు (నిధిధ్యాసలు) మన జీవిత రధములను-విషయమార్గమునందు నడుపుటయే బంధము. నిర్విషయమైన దైవమార్గమున-నడుపుటయే మోక్షము-బంధరాహిత్యము.

**అదే భగవంతుడందించిన గీతారహస్యం.**
**నీ చేతయే - గీత - అదే - నీ నొసటివ్రాత**
**సత్యమైన భగవన్మార్గమే - భగవద్గీత**

## భావార్చన

ప్రియాత్మ బంధువులారా! నాకిప్పుడు 88 సం॥లు నిండిపోయి 89 సం॥లో పయనిస్తున్నాను. వయస్సు పెరిగే కొద్దీ ఓపికలు తగ్గుట సహజమే గదా? నాకిప్పుడు తీరుబడి ఎక్కువ తోచుబడి తక్కువ. ఏ పనిచేయ్యాలన్నా - ఏదో ఒక ప్రజ్ఞ ఉండాలిగదా?

నేనంటారా? పెద్ద విద్యావంతుడును గాను. అంత వివేకంతుడనుగూడా గాను. దాహమెక్కువ, ధనం తక్కువ, అన్నట్లు -

అర్జునా! తపోధనుల కన్నను, జ్ఞానులకన్నను, మతాచార్యులకన్నను, సత్కర్మానుష్ఠానపరుల కన్నను, యోగియైనవాడు గొప్పవాడు. అని కృష్ణ పరమాత్మ గీతలో వివరించి యున్నారు. గీతలోని 18 అధ్యాయములు వారివారి అనుభవాలను అభిరుచులనుబట్టి 18 యోగమార్గముల నందించుచున్నవి.

**"యోగస్థకురుకర్మాణి,** అని నిర్వచించినది గూడా గీతయే = యోగివై కర్మల నాచరించుము.

**"యోగహీనం కథం జ్ఞానం,** అన్నది యోగశిఖోపనిషత్తు

యోగం లేనివారికి - జ్ఞానమెలా సంభవించును.

"కామధేనువు సర్వాభీష్టములకు పెన్నిధి; యోగము సర్వకార్యసిద్ధికి సన్నిధి"

భగవద్గీతను ప్రతీ మహనీయుడు ప్రమాణముగా తీసుకొని వివిధ భాషలలో కొన్నివేల గీతా గ్రంథములను రచించియున్నారు. అవి అన్నియూ బహుళ ప్రచారములో నున్నవి. అట్టి గీతను సాధువులు సన్న్యాసులు, విద్యావంతులు, యోగులు, పీఠాధిపతులు, ప్రచారకులు మతోద్ధారకులు, ఉపన్యాసాలు, ఉద్బోధలు, గీతాయజ్ఞాలు ద్వారా, లక్షలాది ప్రజానీకాన్ని ప్రభావితం చేస్తూనే ఉన్నారు.

అట్టి పిపాస నాలో బహుకాలంగా గాగియుండుటచేత మహనీయుల వెంట మనుగడ సాగించుట జరిగింది. అందువల్ల నా దాహం తగ్గి గీతతో స్నేహం పెరిగింది. ఈ రోజులలో జనానికి 1.

ఆశలెక్కువ. తీరికతక్కువ. అందుచే వినటానికి, చదవటానికి గూడా సమయించాలక బాధపడేవారు బహుళంగా కనిపిస్తున్నారు. అందుకుగాను నేను 700 శ్లోకాలతో 500 నుండి 600 పేజీలలో నున్న గీతను నా వ్రాతలో శ్లోకాలను రద్దుచేసి, సారాన్ని సంగ్రహించి అరగంటలో అయిపోయేలాగా 40 నుండి 50 పేజీలలో పాకెట్ 1బుక్‌లో ఇమిడ్చివేశా! ఇందులో సంస్కృతం లేదు నాకు రాదు గనుక. గంభీరమైన గ్రంధభాష లేదు – పండితుడనుగాను గనుక. నేను గ్రామస్థుడను గనుక గ్రామ్యభాషలోనే వ్రాశా; అందువల్ల అందరికి అర్థమవుతుందన్న ఆశ ఉన్నది.

తమకు తీరికగా నున్నప్పుడు, ఓర్పుతో చదవండి. కష్టంగా ఉంటే కావాలన్నవారికి అందించండి. చెఱుకు రసాన్ని త్రాగి, పిప్పిని విడిచి వేసినట్లు, ఇందలి సారాన్ని సంగ్రహించండి. లోపాలను ఒదిలివేయండి.

తప్పులుంటే క్షమించండి.
తెలియజేస్తే దిద్దుకుంటాం.

ఇట్లు
మీ ఆత్మీయుడు
**డా॥ వి.వి. రామరాజు**

# యోగ - విజ్ఞానము

## భగవద్గీత 18 అధ్యాయములు - యోగములే!

యోగమంటేనే కలయిక. అదే జీవాత్మ పరమాత్మల అనుసంధానం పరమాత్మశక్తి ప్రభవించాలంటే ప్రదర్శనందించే ప్రకృతి కావాలి. ప్రకృతి ద్వారా పరమాత్మ ప్రభవించుట వల్లనే సమస్త చరాచర జీవరాశుల ఉత్పత్తి జరుగుచున్నది. మన భౌతిక దేహాలన్నీ పంచ భూతాత్మకములే, అందుచే మనలో పంచభూతముల భౌతిక శక్తులు పరమాత్మ సంబంధమైన (ప్రాణ) చైతన్యశక్తులు మనలో ఇమిడియున్నవి. అట్టి పరమాత్మ స్థితిని ఎరుగటయే యోగము.

ఏ మనుజుడు తాను చేయుచున్న కర్మలను ఫలాపేక్ష లేకుండా చేయుచున్నాడో? అతడే సన్యాసి. అతడే యోగి - సంకల్పత్యాగము లేనివాడు యోగిగానేరడు. యోగి కాగోరిన వారికి కర్మసాధన లుండవలెను. యోగియైనవారికి శమదమాదులు అతి ముఖ్యము.

మనుజుడు ఇంద్రియ విషయములందును, కర్మఫలాపేక్ష యందును, ఇచ్ఛలేక, సర్వసంకల్పములను విడిచి పుచ్చునో అప్పుడే యోగా రూఢుడనబడును. ఆత్మ నిగ్రహమే యోగము. నిగ్రహించిన ఆత్మయే నిన్నునగ్రహించును. ఆగ్రహించిన ఆత్మయే నిన్నధోగతిపాలు చేయును. జ్ఞాన విజ్ఞానములచేత తృప్తి చెందినవాడును, జయించిబడిన,

ఇంద్రియ నిగ్రహము గలవాడును, యోగి యనబడును. సహృదయులైన మిత్రులను, శత్రువులను, ఉదాశీనులను, ద్వేషులను, బంధువులను, బయటివారిని, పాపులను, సాధువులను, సమదృష్టితో, చూడగలిగినవారే యోగులు. ఏకాంతము, ఏకాగ్రత, ఇంద్రియ నిగ్రహము గలిగి ఫలాపేక్ష లేకుండా మనస్సును పరమాత్మయందు నిలపగలిగినవారే యోగులు. ఆత్మ శుద్ధి గలిగి సమతలమైన ప్రశాంత స్థలములో ఆసనసిద్ధిగలిగి, సుఖాసీనులలై ఇంద్రియ స్వాధీనము గలవారై, ధ్యానము నిష్ఠతో చేయగలిగినవారే యోగమార్గానుగాములు, యుక్తాయుక్త వివేకము గలిగి హిత మితాహార, నిద్ర సేవనలుగల యోగులకు ప్రాపంచిక బంధములు దుఃఖశోకములు అంటవు.

ఎవరికి నిగ్రహించబడిన మనస్సు ఆత్మయందు నిలబడి యుండునో, అతనినే యోగిగా తెలియవలయును. సర్వ ప్రాపంచిక బంధనములను దుఃఖములను పోగట్టుకొనునదే యోగము.

మనస్సును సదా ఆత్మయందే నిలపగలిగిన యోగి బ్రహ్మ సాక్షాత్కారమును, పరమసుఖమును బొందును. శాశ్వతమైన సుఖ శాంతుల నందుకొనుటయే బ్రహ్మసాక్షాత్కారము. సర్వభూతముల యందును పరమాత్మను దర్శించువారే యోగి. అతడు బాహ్య ప్రపంచంలో వ్యవహరించుచున్నను. అతనికి కర్మబంధములంటవు.

**"పవిత్రమైన పరమాత్మ బంధమే యోగము"**

# విషాద యోగము

శ్లో॥ స్వజనమ్ - హీ - కథం - హత్వా - సుఖినఃశ్యామ - మాధవ (1-37)

**స్వజనమైన, సర్వబంధువులను వధించుట ఉత్తమం గాదు గదా?**

1. విషాదము - విషతుల్యము
2. విషాదము వల్ల వివేకము నశించును.
3. నీవు ఎందును గుర్చి విచారించుచున్నావు?
4. దేనిని గూర్చి భయపడు చున్నావు?
5. నిన్ను ఎవరు దండించగలరు?
6. ఎవరు - ఎవరిని చంపగలరు?
7. ఆత్మపుట్టేది గాదు - నశించేది అసలేగాదు.
8. నీవు ఆత్మస్వరూపుడవు - నీకు చావు లేదు.
9. స్వధర్మపాలనయే - నీ ముఖ్యకర్తవ్యము.
10. నీవు క్షత్రియుడవు - ధర్మరక్షణ క్షత్రియధర్మము.
11. స్వధర్మమెరిగి - ధర్మమార్గమున ముందుకు సాగుము.
12. విషాదము వీడి - వివేకముగలిగి, విచారణ సాగించుము.

**అదే విషాద యోగము**

# 2. సాంఖ్య యోగము

**సమ్యక్ ఖ్యాయతే - ఇతి - సాంఖ్యమ్ ॥**

**సత్యవస్తు దర్శనమునకు ఉపకరించునదే సాంఖ్యము.**

సుఖదుఃఖముల యందు సమబుద్ధి గలవాడే మోక్షార్హుడు.

శ్లో॥ క్షుద్రం హృదయ దౌర్బల్యంత్య క్త్వోత్తిష్ఠ పరన్త (2-3)

**అర్జునా! హృదయ దౌర్బల్యమంత, నీచమైనది - మరొకటి లేదు.**

1. జరిగినదంతయూ మంచిదే!
2. జరుగుచున్నది గూడా మంచిదే!
3. అంతా మనమంచికే జరుగుచుండును.
4. భవిష్యత్తును గూర్చి భయపడవద్దు.
5. అందువల్ల అందేవి భయాలు బాధలేగాని నీవైన శాంతిసుఖాలు గావు.
6. జరిగిన దానిని గూర్చి మరిచిపోవుట మంచిది.
7. జరిగేది వర్తమానం జరిగిపోవుచునే యున్నది.
8. ఇక నీవు దేనిని గూర్చి – భయపడవలసిన పనిలేదు.
9. విచారము వీడి – వివేకము గలిగి పయనము ముందుకు సాగించుము.
10. స్థితప్రజ్ఞుడవై స్థిరబుద్ధిగలిగి స్థిమితముగా ముందుకు సాగిపొమ్ము.
11. నీ గమనానికి ఏ అడ్డులేదు. 12. నీ గమ్యానికి ఏ లోటురాదు.

**అదే సాంఖ్యయోగము**

# 3. కర్మ యోగము

శ్లో॥ కర్మ జ్యాయొహ్యా - కర్మణః ॥ (3-8)

**అకర్మల కంటే కర్మలు శ్రేష్ఠము.**

1. సాంఖ్యులకు జ్ఞానయోగము. సర్వజనులకు కర్మ యోగము అనుసరణీయము.
2. కర్మాచరణము లేకుండా ఏ పనిగూడా నెరవేరదు.
3. కర్మచేయనివారికి - శరీరయాత్ర సిద్ధించదు.
4. కామం కర్మలను పెంచును - ప్రేమలు పెన్నిధిలాంటివి.
5. కామంలేని ప్రేమలు - కరుణామయుని దరిజేర్చును.
6. కామం గల ప్రేమలు - కన్నబిడ్డల నందించును.
7. సృష్టియందలి, గ్రహములు - ఉపగ్రహములు విశ్వప్రేమతో విరాజిల్లుచున్నవి.
8. వాటి అన్యోన్య ఆదరణలే - విశ్వగమనానికి ఆధారములు.
9. కామ్యకర్మలు మాత్రం - ఉత్తరజన్మల కుపయెగపడును.
10. జన్మలు - జనన మరణాలను - దుంఃఖశోకాలను అందించును.
11. జన్మలతోనే కర్మలు కదులుతాయి కర్మలులేనినాడు జన్మలు లేవు.
12. కామ్యకర్మలు జీవితగమ్యాన్ని దూరం చేస్తాయనే కర్మధర్మాలను బోధించేదే...

**కర్మయోగము.**

# 4. జ్ఞాన యోగము

శ్లో॥ న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే (4-38)

**జ్ఞానముతో సమానముగా పవిత్రము జేయునదేదియును లేదు.**

1. ఫలాఫలములను - సమబుద్ధితో దర్శించువాడే జ్ఞాని.
2. జ్ఞానిని కర్మఫలములంటవు - చేయుప్రతిపని యజ్ఞమే అగును.
3. నీ సమస్తకర్మలు జ్ఞానము నందే పరిసమాప్తమగును.
4. ఎందును గుర్చి విచారించుచున్నావు? నీదైనదేది పోయింది?
5. నీవు ఏమి వెంటబెట్టుకొనివచ్చావు? నీవు పోగట్టుకున్నదేమిటి?
6. క్షరమైన ఈ దేహంతో నీవు ఏదిచేసినా! అది నశించుపోయేదే గదా?
7. నీకు అందించబడుచున్నవన్నియూ అక్కడ నుండియే నీ కందించ బడుచున్నవి.
8. అందుచే నీవు ఏది చేసినా! (అందించినా) అక్కడికే చేరుతుంది.
9. మనమంతా ఖాళీగానే వచ్చాం. ఖాళీగానే పోతున్నాం గదా?

10. ఈరోజు నీదైయున్నది. నిన్నటిరోజు ఎవ్వరిదో! రేపటి రోజు మరెవ్వరిది కానున్నదో?

11. అది తెలియని నీవు ఇదంతా నాదేనని ఉబలాటపడుచున్నావు. అదే నీ దుఃఖానికి కారణము.

12. అట్టి ఎరుకను ఎరిగి యుండుటయే జ్ఞానమని బోధించునదే జ్ఞానయోగము.

**"అభేద - దర్శనం జ్ఞానం"**



# 5. కర్మ-సన్న్యాస యోగము

శ్లో॥ లిప్యతేనస - పాపేన పద్మపత్రమివామ్భస॥ (5-10)

తామరాకుకు నీరంటనట్లు - కర్మఫలత్యాగులకు, పాపము లంటవు.

## జ్ఞానకర్మయే - సన్న్యాసమగును

1. కర్మ అనగా పని, సన్న్యాసము అనగా ఒదులుకొనుట.
2. మవజన్మయే కర్మలతో వచ్చినది. గనుక కర్మల నొదులుకొనుట అసంభవము.
3. ప్రతివారు కర్మలు చేయకతప్పదు. గాని కామ్యకర్మలు మాత్రమే బంధిస్తాయి.
4. కామ్యకర్మలు సఫలమైతే సంతోషం - విఫలమైతే విచారం తప్పదు.
5. అంటించుకున్న కర్మలు వెంటబడతాయి. ఒదిలించుకున్న కర్మలు వీగిపోతాయి.
6. తగిలించుకొని తంటాలుబడే కంటే - ఒదిలించుకొని ఒడ్డునబడుట మంచిది గదా!
7. కమనీయమైనది కర్మఫలత్యాగమేనన్నది భగవద్గీత.

8. కర్మలు జన్మలనందిస్తాయి. జన్మలు బహుకర్మలలో ముంచుతాయి.

9. కాలం ఆగేది గాదు. అట్లే కర్మలు కూడా ఒదిలేవి గావు.

10. కర్మఫలత్యాగమే - జన్మరాహిత్యమని తెలియండి.

11. యోగమొక్కటే కర్మఫలత్యాగము నందించును.

12. సర్వకర్మల నుండి విడివడి యుండుటయే కర్మసన్యాసము.

## అదే కర్మ సన్యాస యోగము



# 6. ఆత్మ - సంయమ యోగము

శ్లో॥ ఉద్ధరే - దాత్మనాఽఽత్మానం (6-5)

**సాధకుడు - తన నిమ్నాత్మను - ఉన్నతాత్మను ఉద్ధరించు కొనవలయును.**

1. మానవుడు - బాహ్య ప్రపంచంలో బడి వ్యవహారిక జీవితంతో పెనుగులాడుచున్నాడు.
2. గాని ఆంతర్యములోని అంతరంగిక అనుభూతిని అందుకొనలేక పోవుచున్నాడు.
3. సచ్చిదానంద స్వరూపమాత్మ "కాలత్రయేపి, తిష్ఠతి సత్"
4. త్రికాలముల (మూడుకాలములు) యందును సదా భాశించునదే సత్ అందురు.
5. ఆత్మ పరమాత్మ స్వరూపమైన సత్–చిత్–ఆనంద – స్వరూపము.
6. **సత్** అనగా – సత్యమైనది – నిత్యమైనది – శాశ్వతమైనది. అఖండమైనది. అనంతమైనది – అవ్యయమైనది.
7. అంతేగాదు అద్వితీయమైనది అన్నింటిలోను అన్నికాలముల యందును నిండియుండునది. అన్నింటిని తనలో నిముడ్చుకున్నది.

8. **చిత్** అనగా జ్ఞానస్వరూపమైనది. వివేకవంతమైనది. ఉన్నది ఉన్నట్లు చూడగలిగినది.

9. **ఆనందము** అనగా సుఖము - సంతోషము - సంతృప్తి - నిజ స్వరూపమైనది.

10. అసలు నీవెవ్వడవు? - నీ నిజస్వరూపమేది? గమనమెక్కడికి? గమ్యమేది? అని విచారించుము.

11. ఆ స్థితి గోచరమైన వారికి - పరమాత్మ అన్ని జీవాత్మలలోనూ దర్శనమిచ్చును.

12. అదే అన్నింటికంటెను ఉత్తమమైనది.

## అదే ఆత్మ సంయమ యోగము



# 7. విజ్ఞాన యోగము

శ్లో॥ మయిసర్వమిదం ప్రోతం - సూత్రేమణిగణా ఇవ (7-7)

ధారము నందు పూసలు వలె - సర్వము - నాయందే ఇమిడియున్నవి.

1. జ్ఞానము కలిగిన కొలది - దూరము చేరువగును.
2. సృష్టికర్తకారణము. సృష్టికార్యము; కార్యము - కారణముకన్న భిన్నముగానట్లు కారణమైన భగవంతుడు. కార్యమైన సృష్టికన్న భిన్నం గాడు.
3. పరివర్తన అనేది ప్రకృతి జనితమైన మార్పు - నీవు మృతుడవైన మరుక్షణంలో మరొకజీవిగా పుట్టవచ్చును.
4. మార్పు అనేది! బాంధవ్యాలలో తండ్రిరాగేనే నీవు తన యుండవౌతావు.

   నీ తనయుడు (కొడుకు) రాగానే నీవు తండ్రివౌతావు గదా?
5. పాత్రలు మారుతూ ఉంటాయి గాని నీవు మాత్రము మారేవాడివిగావు.
6. ఇష్టమైనది పొందిననాడు - నీవు రాగివౌతావు.

   అయిష్టమైనది అందిననాడు ద్వేషివౌతావు.

7. నాటకంలోని వేషధారివలె మార్పులనభినయిస్తూ ఉంటావు గాని నీవు మాత్రం మారేవాడివి గావు.

8. విజ్ఞానవంతుడవై - విచారిస్తేనేగాని మార్పులు తెలియబడవు.

9. మార్పుజెందేవి ప్రకృతి - ప్రవృత్తులేనని తెలియుటయే విజ్ఞానము.

10. విజ్ఞానము - వివేకము నందించును.

11. వివేకికి - విషయజ్ఞానము దూరమై పరమాత్మభావం చేరువగును.

12. అట్టి అనూహ్యమైన మార్పులను తెలియజేయునదే...

**విజ్ఞాన యోగము.**



# 8. అక్షర పరబ్రహ్మ యోగము

శ్లో॥ తస్మాత్సర్వేషు - కాలేషు - మామనుస్మరయుధ్యచ ॥ (8-7)

సర్వకాల సర్వావస్థలయందును నన్నే స్మరించుచుండుము.

1. క్షరముగానిది - అక్షరము - అదే అక్షయమైనది.
2. క్షరము అనగా కనిపించి కనుమరుగై పోవునది.
3. నశింపులేనిది - చావు - పుట్టుకలు లేనిది అక్షయమైనది ఆత్మఒక్కటే.
4. అట్టి ఆత్మను వెదుకు వాడు గోపి క్షరమును వెదుకువాడు పాపి.
5. పాపములు తిరిగి జన్మలనందించును. గాన అందును గూర్చిన విచారణ కావాలి.
6. విచారణ వల్ల విషయాలు దూరమై - నిర్విషయాలు చేరువౌతాయి.
7. అప్పుడు ఈ నశించేదేహం నీవు గావు, అని బోధపడుతుంది.
8. అట్టి స్థితిలోనే - నీవు క్షరాన్ని వీడి, అ-క్షరాన్ని గూర్చి వెదుకుతావు.
9. ఆ అన్వేషణలో అక్షయమైన బ్రహ్మమే నీవన్నది తెలుస్తుంది.
10. అప్పుడే నీకు క్షరా-క్షర బేధభావముల విజ్ఞానం బోధపడుతుంది.
11. అట్టి బోధలు ఎరుగనివారు - బాధలనుభవిస్తూ ఉంటారు.
12. అట్టి అన్వేషణ వల్ల అక్షయమైన బ్రహ్మమే నీవని తెలియజెప్పునదే

**అక్షర పరబ్రహ్మయోగము.**

# 9. రాజవిద్యా రాజగుహ్యయోగము

శ్లో॥ తత్కురుష్వ - మదర్పణమ్ ॥ (9-27)

**నీవు చేయునవన్నియూ - నా కర్పించుము.**

1. విద్యఅనగా తెలుసుకొనదగినది - అట్టి విద్యలకు విద్యయే రాజవిద్య.
2. ప్రస్తుత ప్రపంచంలో నడుస్తున్నవన్నియూ జీవన లౌకిక విద్యలై యున్నవి.
3. లౌకిక విద్యలు - నిజజీవితంలోని - వెలితిని తొలగించలేవు.
4. నాది - నీది - నీవు - నేను - చిన్నా-పెద్ద - మంచి-చెడ్డ అనేవి అన్నియూ నీ నిజస్వరూపాలు మాత్రంగావు.
5. అవి అన్నియూ - నీ మనోగతాలు మనస్సు చంచలస్వభావం గలది.
6. అందుకుగాను - నీవు నిశ్చలమైన మనస్సుతో - వివేకము గలిగి విచారిస్తే వాటి తరతమ బేధాలు తెలియబడతాయి.
7. సముద్రములోని అలలు సముద్రమునకు వేరుగావు గదా? అట్లే నీలోని తరతమ బేధాలు గూడా నీవై ఉంటావు.

8. అప్పుడు అన్నీ నీవేనని తెలియబడుతుంది. - అన్యభావం పోతుంది.

9. అట్టి స్థితిని ఎరిగినవాడు, నీలోని భేదభావాలు తొలగిపోతాయి.

10. దానినే అభేద దర్శనమంటారు. అదే సంపూర్ణజ్ఞానం.

11. అట్టి గోప్యమైన విద్యా విషయములను బోధించునదే రాజవిద్య.

12. విద్యలకు - విద్యయైన - యోగవిద్యయే.

**రాజవిద్యా రాజగుహ్యయోగము.**



# 10. విభూతి యోగము

శ్లో॥ అహమాత్మా - గుడాకేశ సర్వభూతాశయస్థితః ॥ (10-20)

**నేను అన్నిభూతములలోను దాగియున్న ఆత్మను.**

**భక్తుల - అనుభూతులే - విభూతులు.**

1. ప్రతి వ్యక్తిలోనూ వ్యక్తీకరింపబడు భగవదైశ్వర్యమే విభూతి.
2. జీవాత్మ, పరమాత్మను బొందుటయే - భగవదైశ్వర్యము.
3. భగవంతుడు సర్వరక్షకుడు - పోషకుడునై యున్నాడు.
4. అందుచే మనరక్షణలు పోషణలు క్షేమములు దైవదత్తమై యున్నవి.
5. సృష్టిలోని - సకల - చరాచరజీవరాసులన్నియూ దైవదత్తములే.
6. నీలో గల చైతన్యశక్తియే సకల జీవులలోనూ ఇమిడియున్నది.
7. అందుచే వాటికి మనకు బేధము లేదు, అని తెలియబడుచున్నది.
8. అకారణముగా సృష్టిలోని వన్నియూగూడా, నీవే అయిఉన్నావు.
9. నీ రూపము వాటి -వాటి రూపములు వైరైనా! అందరిలోను ఉన్నది చైతన్యమొక్కటే గదా?

10. మనకు కనిపించే రూప భేధములు మాత్రం మనోగతములై యున్నవి.
11. అందుచే చైతన్య స్వరూపములన్నియూ నీవేనని తెలియబడుచున్నది.
12. అట్టి నిత్య సత్యానుభూతిని అందించేదే.

**విభూతి యోగము.**



# 11. విశ్వరూప - సందర్శన యోగము

శ్లో॥ సర్వాశ్చర్య-మయందేవం అనంతం విశ్వతోముఖం

(11-11)

**ఈ అనంతమైన - విశ్వమంతయూ - నాలోనే ఇమిడియున్నది.**

1. భగవంతుడు అనంతుడు - మన నేత్రములు పరిమితములై యున్నవి.
2. అపరిమితములు - పరిమితముల కందవు. అందుచే పరిమితము లైన మన నేత్రములు అపరిమితుడైన దైవాన్ని దర్శించలేవు.
3. విశ్వము అనగా దృశ్యమాన ప్రపంచమై యున్నది.
4. విశ్వదృశ్యములను మాత్రం మన దృక్కులద్వారా దర్శించవచ్చును.
5. అట్టి దృక్కులకు దృష్టిని ప్రసాదించినవాడు - అగోచరుడైన భగవంతుడు.
6. ఉన్నది - ఉన్నట్లు తెలియుటయే తెలివి - ఆ తెలివి తేటమైనప్పుడే వివేకము గలుగును.
7. వివేకము - విశ్వమంతటిలోను, భగవద్దర్శనము చేయించును.

8. సమస్త జీవరాసులలోనూ, నీలోను గూడా చైతన్య మిమిడియున్నది.
9. అట్టి చైతన్యమే ఈ విశ్వమంతటిని క్రమబద్ధముగా నడిపించుచున్నది.
10. అట్టి విశ్వమంతటిలోను - చైతన్యమును సమముగా దర్శించువాడే సమదర్శకుడగును.
11. శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునకు అట్టి వివేకము నందించి జ్ఞాననేత్రము తెలిపించి విశ్వరూప సందర్శనము గావించెను.

## ఇదే విశ్వరూప సందర్శన యోగము



# 12. భక్తి యోగము

శ్లో॥ మయ్యర్పిత - మనోబుద్ధిః యో మద్భక్త స్సమేప్రియః ॥

(11-12)

## సర్వం నాకర్పించిన భక్తుడు - నాకత్యంత ప్రియుడు

1. ఆర్తితో భగవంతుని ఆశ్రయించినవారే భక్తులు
2. సత్యమును గ్రహించి - నిత్యమును దర్శించవలెనన్న ఆశక్తియే భక్తి.
3. వ్యక్తిని - విమలచిత్తుని జేసి విముక్తి నందించేదే భక్తి.
4. భక్తి వలన విషయానురక్తి తగ్గి హృదయము భగవతార్పితమగును.
5. భక్తుల హృదయాలలో ప్రతిదీ భగవంతుని రూపంలోనే గోచరించును.
6. భక్తి భావం బాగా పెరిగినవారికి అన్యథాఅనురక్తి పోయి విరక్తి భావం అంకురించును.

## భక్తి బహువిధములు

7. అడంబరభక్తి - అన్యులతో అనుభందం పెంచి రక్తి నందించును.

8. అలంకారభక్తి - అందచందాలను ఆర్భాటాలను పెంచును.

9. మూఢభక్తి - మూర్ఖతనందించి, ముందుకు సాగనివ్వదు.

10. సంశయభక్తి - సందేహములను పెంచి సంశయాత్మ నందించును. "సంశయాత్మ వినశ్యతి"

11. ఆశాభక్తి - కోరికలను పెంచి విషయానురక్తి నందించి విరక్తిని దూరం చేయును.

12. నిశ్చలభక్తి - విరక్తిని గలిగించి విముక్తిని అందించును.

**అదే భక్తి - యోగము**



# 13. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగము

శ్లో॥ క్షేత్రజ్ఞం చాతిమాం విద్ధి -

సర్వక్షేత్రేషు భారత ॥ (13-2)

**సర్వక్షేత్రములయందు నుండు క్షేత్రజ్ఞుడను - నేనే.**

1. అంధునికి ఆదిత్యుని తేజము గూడా అందదు. అట్లే అజ్ఞానికి విశ్వదర్శనం గాదు. అందుకు జ్ఞాననేత్రం కావాలి.
2. ధర్మావలంబనం - మనస్సుగల మానవునికొక్కనికే సాధ్యమగును.
3. ధర్మముల నాశ్రయించిన దేహం ధర్మక్షేత్రమగును. అధర్మ ప్రవర్తన గల దేహం కురుక్షేత్రమగును.
4. ధర్మాచరణమును బోధించు మతములెన్నియున్ననూ - మనిషికి ఊరట కల్పించుచున్నవేగాని అశాంతి నంతమొందించలేకున్నవి.
5. ప్రతి మానవుడు - నిత్య సుఖము నందించు శాంతిని గోరుచుండును.
6. ధర్మాచరణములతో గూడిన ఈ దేహం నీదేగాని - నీవు మాత్రం దేహం గాదు.
7. క్షేత్రమైన - ఈ పంచభూతాత్మక దేహం పంచభూతములలోనే కలిసిపోవును.

8. క్షేత్రజ్ఞుడవైన - నీవు మాత్రం శాశ్వితుడవు - నిత్య-శుద్ధ-బుద్ధుడవు.

9. దేహి ప్రారబ్ద మనుభవించుటకు మాత్రమే ఈ దేహము ఉపయోగపడును.

10. ఉద్యోగికి అద్దె కొంపలాగా దేహియాత్రకు దేహముపయోగడును.

11. దేహమే నేనన్న భావాన్ని వీడి దేహధర్మాలను పాటించును దేహబాధలు రాకుండా చూచుకోవాలి.

12. క్షేత్రానికి - క్షేత్రజ్ఞునికి (దేహికి-దేహానికి) గల తేడాను నిరూపించి, బోధించునదే

## క్షేత్ర-క్షేత్రజ్ఞ - విభాగ యోగము



# 14. గుణత్రయ - విభాగ యోగము

శ్లో॥ సత్త్వం - రజ-స్తమ -

ఇతి గుణాః ప్రకృతి - సంభవాః (14-5)

**ప్రకృతి జనితముల్లైన - సత్త్వ రజస్తమోగుణాలు జీవుని దేహమునందు బంధించును.**

1. క్షేత్రములనబడే - మన దేహమునలన్నియు పంచభూతాత్మకములు అందుచేత అవి త్రిగుణములకు లోబడియుండును.
2. క్షేత్రజ్ఞులైన - మానవులంతా దేహమే తామన్న భ్రమలోబడి యుండుట వల్ల గుణత్రయములు బంధించుచున్నవి.
3. అందున వారి - వారి పూర్వవాసనల ననుసరించి - నడవడులు - అభిరుచులు - ఆహారములు వేరగుచున్నవి.
4. ఆ వాసనలచే - సత్త్వ - రజస్తమోగుణములనే గుణత్రయము లన్నారు.
5. ఇందు నిర్మలమైనది. సత్త్వగుణము. అయితే ఇది ఇంద్రియ సుఖములయందు గల ఆశక్తిచే జీవులను బంధించుచున్నది.
6. ఉత్తేజము, ఉద్వేగము - ఉద్రేకము గలది రజోగుణము. ఇది దృశ్య విషయముల యందు ప్రీతిని గల్పించి విషయ లంపటలలో ముంచును.

7. కేవల అజ్ఞానము - పశుత్వము - మూర్ఖత్వము గలది తమో గుణము. ఇది మోహమును, అనురాగమును, కామమును అందించి దుఃఖశోకములలో ముంచును.
8. అందుచేత నిన్ను త్రిగుణములు గూడా బంధించునవై యున్నవి.
9. అందుకు త్రిగుణాతీత స్థితిని అనుసరించుటయే ఉత్తమ - మార్గము.
10. అందులకై మనం గుణత్రయములపై గురిని వీడి గుణాతీత స్థితిని బొందుటకు ప్రయత్నించవలెను.
11. అందుకు నిర్గుణ పరబ్రహ్మ స్వరూపమును నెరుగుటయే ఉత్తమ మార్గము.
12. త్రిగుణాతీతస్థితియే బంధరాహిత్యము అని బోధించునదే

## గుణత్రయ - విభాగ యోగము



# 16. దైవాసుర - సంపద్విభాగ యోగము

శ్లో॥ మాశుచస్సంపదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ ॥
(16-5)

**అర్జునా? భయపడకు నీవు దైవీ సంపదతో పుట్టియున్నావు.**

**"మనఏవ మనుష్యాణాం - కారణం బంధమోక్షయోః ॥**

1. బంధమోక్షాలకు మనస్సే ప్రధానకారణము. ఆ మనస్సే సంపదలను చింతలను గూడా అందించును.
2. సురులు అనగా దేవతలు (స్వర్గలోకం) అసురులు అనగా రాక్షసులు (నరకలోకం)
3. ఇంద్రియ నిగ్రహం, అశన నిగ్రహం గలిగి, అనిమిషులైయున్నవారు దేవతలు.
4. అట్టివారు అమృతాహారులై వష్మోపరిమితిలేక సర్వసుఖములను అనుభవించుదురు.
5. అట్లుగాక రజోగుణ, తమోగుణ సంపన్నులై ఇంద్రియలోలురైనవారు రజోగుణ తమోగుణరాక్షసులు.
6. అట్టివారు మృతాహారులై - వికృతరూపులై దుఃఖశోకాలను అనుభవించుదురు.

7. ఇంద్రియాలలో బాహ్యప్రపంచంలో సుఖశాంతులకై వెతికేవారు భోగులు. వారే రోగులుగా జీవయాత్ర సాగించుచున్నారు.
8. అంతర్యములోని ఆత్మను వెదికేవారు యోగులు. అవధూతలు.
9. అట్టివారే - సర్వసంగపరిత్యాగులై - సర్వేంద్రియ గుణత్యాగులై విలసిల్లుచున్నారు.
10. అశన - నిగ్రహము - ఇంద్రియ నిగ్రహము గలిగి అమృతాహారమును సేవించువారికి దైవీసంపదలందును.
11. జిహ్వోపస్థలకు దాసులై - మృతాహారులు, శవాహారులైన వారికి అసురీ సంపదలందును.
12. అట్టి సంపత్తులను - విపత్తులను గూర్చి బోధించునదే...

## దైవాసుర - సంపద్విభాగ యోగము



# 15. పురుషోత్తమప్రాప్తి - యోగము

శ్లో॥ అసఙ్గశస్త్రేణ - దృఢేన ఛిత్త్వా ॥ (15-3)

**దృఢచిత్తుడవై - సంగమను అనే కోరికలను సంగరాహిత్యము అను శస్త్రముచే ఖండించుము.**

1. నిత్యముమగు నా అంశవే - ప్రకృతిలో జీవుడైన మానవుడైయున్నాడు.
2. ప్రకృతిలోగల, శబ్ద - స్పర్శ-రూప-రస-గంధాదులతో గూడిన మనస్సు గలవాడే - మానవుడు.
3. అందువల్లనే శబ్దాది - బాహ్యవిషయలంపటలలో బడి ఉంటున్నాడు.
4. అట్టి ఇంద్రియ లోలత్వముగల జీవాత్మ పరమాత్మను అజ్ఞానదశలో దర్శించలేకున్నాడు.
5. ఆత్మసాక్షాత్కారమునుగోరు యోగులు మాత్రము పొంద గలుగుచున్నారు.
6. బాహ్యవస్తు సంసర్గము - విభిన్న కోరికలను విశేషముగ అందించును.

7. కోరికలు (కొంపలనే - సంసార బంధనాలలో బంధించును.)
8. సంసారాలు సాగరరూపమును దాల్చి మనోవికారాలను దుంఖ శోకాలను అందించును.
9. పురుషుడు అనగా సమస్త జీవులకు ప్రాణశక్తి నందించి పోషించు వాడు.
10. పురుషోత్తముడు మాత్రం, సూర్య-చంద్ర-అగ్నులలో గల తేజో శక్తియూ - జీవులలోగల, జఠరాగ్ని శక్తియూ, నేనేంటున్నాడు.
11. అంతేగాదు సృష్టిలో గల క్షరాక్షర శక్తిలన్నియూ గూడా నేనే నంటున్నాడు. పురుషోత్తముడు.
12. అట్టి ఆదిపురుషుని ఎరుగుటయే

## పురుషోత్తమప్రాప్తి యోగము



# 17. శ్రద్ధాత్రయ - విభాగయోగము

శ్లో॥ రస్యా-స్నిగ్ధాః స్థిరా-హృద్యా -

ఆహారాః సాత్త్వికప్రియాః ॥ (17-8)

**రసయుక్తమైనది - చమురుతో గూడియున్నది స్థిరమైన అణువులు గలది, హృదయానందముగ, ఉన్నది, ఉన్నట్లు తినగలిగినది, మాత్రమే సాత్త్వికాహారము.**

1. జీవుల యొక్క స్వభావకర్మ సంస్కరణలను బట్టి - శ్రద్ధయనునది లభించును.
2. శ్రద్ధవల్ల ప్రతికార్యము సిద్ధించును. (నెరవేరును) అశ్రద్ధవల్ల కార్యసిద్ధి జరుగదు.
3. మన నిత్యకార్యక్రములకు - కార్యసాధనకు కర్మత్యాగమునకు శ్రద్ధ అనునది అత్యవసరమైనది.
4. "శ్రద్ధావాన్ - లభతేజ్ఞాన" అన్నది శాస్త్రం.
   శ్రద్ధగలవారికి జ్ఞానంగూడా లభించును. అన్నది నిర్వచనం.
5. శ్రద్ధను - మూడు విధములుగా విభజించియున్నారు.
6. 1. భౌతిక దేహారోగ్యమును గూర్చిన- ఆహారసంబంధమైన శ్రద్ధ.

7. ఇందు సాత్త్విక - రాజస - తామసాహారములనుగూర్చి వివరించియున్నారు.

8. 2. కర్మలను (నిత్యకార్యములను) యజ్ఞ యాగాదికర్మలను గూర్చి శ్రద్ధ.

9. ఇందు, సాత్త్విక రాజస - తామస కర్మలను - యజ్ఞయాగాదులను గూర్చి వివరించియున్నారు.

10. 3.మానసిక సంబంధమైన జపతపాదులను గూర్చిన శ్రద్ధ -

11. ఇందు శారీరక - మానసిక - వాచికజపములను ధ్యానములను గూర్చి వివరించియున్నారు.

12. శ్రద్ధ యొక్క ఉన్నతిని గూర్చి బోధించినదే....

**శ్రద్ధాత్రయ విభాగ - యోగము.**



# 18. మోక్షసన్న్యాస - యోగము

శ్లో॥ "మా మేకం - శరణం వ్రజ" ॥ (18-66)

**నా సర్వస్వమును త్యజించి - నిన్నే శరణువేడుచున్నాను.**

గీతాసారమంతయూ ఇందు ఇమిడియున్నది. కామ్యకర్మలను ఒదులుకొనుట సన్న్యాసమందురు. కర్మఫలముల నొదులుకొనుట - త్యాగమందురు.

1. వస్తువు - దేశము కాలము - పరిమితములు.
2. మన కోరికలు కొండంతలు గాన అపరిమితములు
3. పరిమితములకు అపరిమితములందుట దుర్లభము.
4. మనస్సు - ఇంద్రియములు - ఇంద్రియ విషయములు ఏకమైనప్పుడు తాత్కాలిక సుఖము లభించును.
5. ఇందులో ఏ ఒక్కటి కలిసి రాకపోయిననూ ఆ క్షణిక సుఖంగూడా ఉండదు.
6. దేశ, కాల, వస్తుపరిధుల నుండి విడివడి యుండుటయే మోక్షము.
7. దానినే ముముక్షత్వమందురు. అదే బంధవియుక్తి బంధరాహిత్యం గూడా.

8. తగిలించుకొని ఒద్దుడై బాధలు పడుచున్న సంసారి తంటాలుబడక తప్పదు.

9. ఒదిలించుకున్న సన్న్యాసి మాత్రం ఒద్దునబడే వీలున్నది.

10. ఇందుకు ముందు ఈషణత్రయాలకు దూరం కావాలి.

11. ఒదిలించుకొని ఒద్దునబడేదే మోక్షము. తగిలించుకొని తంటాలు బడేదే పెను బంధము.

12. మోక్షమంటేనే బంధవిముక్తి - అదే అందరూ కోరే ముక్తి.

**అదే మోక్షసన్న్యాసము,**





రత్నా స్క్రీన్ ప్రింటర్స్ కాకినాడ, ☎ 376996

